## స్వాతంత్ర్యసమరము ఇంకను ప్రారంభమే

కాంగ్రెసు సత్యాగ్రహమునుగూర్చి మహాత్ముని అభిప్రాయము

...త్యాగ్రహమునుగూర్చి గాంధి ...ద్ అను పత్రికయొక్క ...బ్రవాసినాడు:- ...రారంభించను మాత్రమే నపరీక్ష, నిజమైనట్టి ...ఈదీర్ఘమైనట్టియు, పోరాటములో గుణము ...ను. పరిమాణ మెప్పుడును ...పోరాటములో ద్వేషమునకు ...కపటవేషములకు అంతిమము ...ధ్యతవహించి నడిపించుచున్న ఈ ద్యముకావచ్చును. నేనుచెప్పునదెవరికి ...ధినికానిచో, నావిశ్వాసము ప్రకారము ...ర్తించుచో, అదిసాకుచాలును. ప్రపంచ ...ంతిక్షణమో, ఇప్పటిఅవసరములకు ఈ ఉద్యమ ...చాలదు ఈతరములో ఉద్దేశించిన ఫలితము నీ ...ధించినట్లుచేయుటకు జాతిలో ఎక్కువభాగము ఈ ఉద్యమమునకు ఆధారముగనున్నదని నిర్ధారణ గనిరూపింపవలెను. అట్లునిరూపించుట సాధ్యము గులోగా ఇంకనుఎంతో జరుగవలసియున్నవి. ఇప్పటిప్రయత్నము అందుకై నిగర్వముగ చేయబడు ప్రయత్నమే. నిష్కపటప్రయత్నము చేయుటమాత్రమేమానవునివంతు. సత్యాగ్రహోద్యమములో భగవంతుడు ఫలదాతఅనునది ప్రత్యక్షరము సత్యముకాబట్టి నేనువిశ్వాసముకల్గమాత్రమే నిలచియున్నాను. ఇతరసత్యాగ్రహులునుకూడ విశ్వాసమేఆవలంబనముగ నుండవలెను.

### ఇక క్రొత్త సత్యాగ్రహులులేరు

ఇకమీదట సత్యాగ్రహముచేయుటకు గాంధిమహాత్ముడు క్రొత్తవారలను ఆమోదించరట. ఇదివరకు మహాత్మునిఆమోదముపొందినవారలుమాత్రమే సత్యాగ్రహముచేయుచుండవలెను అందుచేఢిల్లీనుండివచ్చిన సత్యాగ్రహులపేర్లుగలపట్టికనొకదానిని మహాత్ముడిపుడా మోదించలేదు.

### సరిహద్దురాష్ట్రములో పంటకాలపుసెలవు

సరిహద్దురాష్ట్రములో పంటకాలమునకై ఏప్రిల్ ౧౨వదవతేదీనుండి సత్యాగ్రహమును ఆపివేసినారు.

### పంజాబులో ఇఫ్తిఖారుద్దీన్ గారికి నిషేధము

పంజాబురాష్ట్రకాంగ్రెసు సంఘకార్యదర్శియగు మియా ఇఫ్తిఖారుద్దీన్ గారిని సత్యాగ్రహముచేయవద్దనిమహాత్ముడుకోరినారు. ఇఫ్తిఖారుద్దీన్ గారిపుడుపంజాబు రాష్ట్రములో సత్యాగ్రహోద్యమమును నడిపించుచుండవలెనుమాత్రమేనవలెను.

### డాక్టర్ సుబ్బరాయన్ గారి విడుదల

ఇదివరలోమద్రాసు రాష్ట్రమునందు కాంగ్రెసు మంత్రివర్గమందు ఒకమంత్రిగానుండి తర్వాత సత్యాగ్రహంచేసి జైలుకుపోయిన డాక్టర్ పి. సుబ్బరాయన్ గారుశిక్షకాలము పూర్తియగుటచే మే ౨వతేదీనతిరుచునాపల్లి సెంట్రల్ జైలునుండి విడుదలచేయబడినారు.

### ఢిల్లీకిచేరిన మొదటి సత్యాగ్రహిగతి

ఇటీవలఒకకాంగ్రెసు సత్యాగ్రహి ఢిల్లీకిచేరినవారలలో మొదటివాడని వినియుంటిమిగదా? ఈసత్యాగ్రహి ఢిల్లీకి చేరి ఇక నేమి చేయవలెనని గాంధిమహాత్మునికివ్రాయగా మహాత్ముడుఅతనిని తనరాష్ట్రమునకు తిరిగిపోవలసినదిగ తెలియబరిచెనట. ఇందుకుకారణమువిచారించగా ఆసత్యాగ్రహివర్ధానుండిఢిల్లీకి రైలుమీదచాలదూరము ప్రయాణముచేసి యుండెననియు, గాంధిమహాత్ముడుఢిల్లీకిపోవుసత్యాగ్రహులు పూర్తిగాకాలినడకనే చేరవలెననిఇచ్చిన ఆదేశమునకు యిదివిరుద్ధముగనున్నదని గాంధిమహాత్ముని ఆక్షేపణ.

ఢిల్లీకిచేరినసత్యాగ్రహులు ఢిల్లీఅధికారులకు తెలిపిఢిల్లీలో సత్యాగ్రహము చేయవలెననియు, అప్పటికినివారలను అరెస్టుచేయనిచో వారలు ఢిల్లీరాష్ట్రములోనిర్మాణ కార్యక్రమముసాగించుచుండుటకుఢిల్లీరాష్ట్రకాంగ్రెసు సంఘమువారేర్పాటుచేయవలెననియు గాంధిమహాత్ము... ఆదేశము ...

ఢిల్లీకిపోవుచుండిన ౧౧ మందిసత్యాగ్రహులను బాగపూతలోఅరెస్టుచేసి బయలుదేరినచోటకు పంపించివేసినారు.

### సత్యాగ్రహవిషయములో హైకోర్టువారి క్రొత్తతీర్పులు

లాహోర్, హైకోర్టువారు బార్ అసోసియేషనువారుముగ్గురుసత్యాగ్రహుల శిక్షవిషయంలో పెట్టినవిజ్ఞప్తినిగూర్చిఆలోచించిమే ౬తేదినతీర్పుచేసినదేమనగా, యుద్ధప్రతికూలవాక్యములుచ్చరించదలచినామని ఎవరుగానిముందుగా అధికారులకు తెలియజేసినంతమాత్రాన వారలనుదేశరక్షణనియమములలో ౧౧౯ నియమం క్రింద నేరస్థులనవీలులేదు. తీర్పుచెప్పె హైకోర్టువారు క్రిందికోర్టుచేనేరస్థులని నిర్ణయించబడి శిక్షవిధించబడిన ముగ్గురు సత్యాగ్రహులను విడుదలచేయుటకు ఆజ్ఞాపించినారు. ఈప్రకారంగా అముగ్గురున్ను వరుసగా ౧౨ నెలలకఠినకారాగారవాసశిక్షతో పాటు రూ. ౫౦౦ల జుర్మానా, ౯ నెలల కఠిన కారాగారవాసశిక్షతోపాటు రూ ౨౦౦లను, ౬ నెలల కఠినకారాగారవాసశిక్షతోపాటు రూ. ౪౦౦ల జుర్మానాను తప్పించుకొనినారు.

## గ్రీసు, యుగోస్లావియా, తుర్కీలలో ఈడన్ గారిపని

బ్రిటిషు పార్లమెంటులో విమర్శ.

మే ౬ న తేదీన బ్రిటిషు పార్లమెంటు కామన్సు సభలో విదేశాంగమంత్రి అంథొనీ ఈడెనుగారు యుద్ధ పరిస్థితిని గురించిన చర్చలో, అనేక ముఖ్యాంశములను తెలిపిరి

గ్రీసుకు సహాయమును పంపు విషయములో సామ్రాజ్య సైన్యాధికారికిని, నావికను, మధ్య ప్రాచ్య,మధ్యధరా ప్రాంత, విమానసేనానులకును మధ్య విభేదాలున్నవను దుష్టమైన వార్తలలో ఏమాత్రం నిజం లేదు.' అని ఈడెనుగారు చెప్పిరి.

యుగోస్లావియాలో ప్రభుత్వమును హఠాత్తుగా మార్పుటకు ముందు, ఎన్ని మాటలు చెప్పినను సైన్యసమీకరణ త్వరగా జరగలేదు. ఆ తర్వాతనే యుగోస్లావు సైన్యాలను సిద్ధపరచుటకు యత్నములు జరిగినవి. అప్పటికి జర్మను పోటు నాపుటకు సమయం మించిపోయినది.

హోరు బెలీషాగారు ఇట్లు విమర్శించిరి:— ఇటలీని సకాలంలో బాంబుచేసియుంటే, గ్రీసును కాపాడియుండవచ్చును బ్రిటిషు దండయాత్రా సైన్యబలము తగినంతలేదు. మటపన్ నౌకా యుద్ధముమాయపన్నాగముగానుండెను. దానివల్ల జర్మనులు ఉత్తరాఫ్రికాకు కొత్త సైన్యాలను పంపగలిగిరి. బ్రిటిషువారు డరాకులోకూడ విఫలులైరని అనవలెను. ఎక్కువ కవచములు, ఎక్కువ టాంకులు, డైవుబాంబర్లు, సైన్యవాహక నావలు కావలెను. జరిగిన అభివృద్ధి చాలదు.

లార్డు ప్రీవిసీల్ అట్లీగారు బెలీషాగారికి జవాబిస్తూ, ౧౯౪౦ం జనవరి వరకు బ్రిటిషు యుద్ధసన్నాహాలు చాలావరకు హోరు బెలీషాగారి అధికారం క్రిందనే ఉండిన వనిరి. యుద్ధమంత్రిగా నుండగా తాము చేసినది అంతకు ముందు మంత్రి చేసినదానిని బట్టియుండెనని హోరు బెలీషాగారు గమనించి యుందురు.

కామన్సు సభతోపాటు లార్డ్సుసభలోకూడ ఒకతీర్మానంప్రతిపాదింపబడినది, కొన్ని ఘంటల చర్చతర్వాత ప్రభుత్వంపై విశ్వాసమున్నదనే తీర్మానమును ప్రభువుల సభ ఏకగ్రీవంగా ఆమోదించింది.

### ఈడెనుగారి ఉపన్యాస వివరములు

ఈడెనుగారి ఉపన్యాసములో మరికొన్ని వివరము లిట్లున్నవి :—

జర్మనులో వసంతకాలములో చేయగల యుద్ధ వ్యవహారమును గురించి బ్రిటిషు ప్రభుత్వానికి తెలిసినది యిది : రుమేనియాను ఆక్రమించి వారు గాబట్టి, బల్గేరియాలో బలం ఏర్పరచుకొని తద్వారా యుగోస్లావియాను చుట్టుముట్టి, గ్రీసును లోంగదీసి, తుర్కీని కదలకుండ చేసి. అక్కడనుండి ఒక గుంపు కాల్చకుండా, తూర్పు మధ్యధరాలో మన స్థానముపై పెద్దదెబ్బతీయ దలచిరి, అల్బేనియాలో ఇటలీకి సహాయం చేయుట ఒక జర్మను ఆలోచన కూడ.

ఫిబ్రవరి 8 న మన సైన్యాలు బెంఘాజీప్రవేశించినవి. ఫిబ్రవరి ౯ న గ్రీసుప్రభుత్వం వద్దనుండి బ్రిటిషుప్రభుత్వానికిఒకవుత్తరం వచ్చినది. జర్మను దౌర్జన్యాన్ని ప్రతిఘటించక గ్రీసు ప్రభుత్వం నిశ్చయించినమాట అందులో ధృవపరచబడినది. మనం చేయగల సహాయం దానికి షరతులు వారు అడిగిరి, అందువల్ల, బెంఘాజీలో ఆగి, గ్రీసుకు సహాయంగా సైన్యాలు పంపుటకుముందు చేసిన నిర్ణయాన్ని బ్రిటిషు సైన్యం అనుసరింప నిశ్చయించి, ఆ సైన్యాలను సన్నద్ధ పరచి నిశ్చయించినారు,

ఫ్రాన్సు కూలిపోయినందున, తుర్కీకి ఆయుధములను పంపే బాధ్యత, గ్రీసుకు ఇచ్చిన గ్యారంటీ నిర్వహించవలసిన బాధ్యత మనపైన మాత్రమే పడినది. మేము కెయిరోకు వెళ్ళాము. అక్కడ ముగ్గురు సేనానులు లండనులో మేము నిర్వచించిన విధానాన్ని పూర్తిగా ఆమోదించిరి. గ్రీసుకు పంపవలసిన మెట్టసైన్యాలు నిర్ణింపబడి యుండెను. వాటి కూడలికి ఏర్పాట్లు జరుగుచుండెను. ఉత్తరాఫ్రికాలో మిగిలిన సైన్యము రాగల ఉపద్రవాలకు చాలునని అనుకున్నాము. కొన్నాళ్ల తర్వాత అందరు ఏథెన్సుకుపోనిశ్చయించిరి. అడ్మిరల్ కనింగాం అప్పుడు మటపన్ యుద్ధంవల్ల రాలేకపోయినాడు. మాలియాక్మన్ క్రేణివద్దగల అంగ్ల గ్రీసు సైన్యాలను నిలబెట్టితే జర్మను పురోగమనాన్ని అరికట్టుటకు అవకాశముంటుందని వారు నిర్ణయించారు. గ్రీసులో యెవ్వరూ గడచినదానికి వగచుట లేదు, దూషించుటలేదు.

ఇది యుగోస్లావియా సంగతి. ప్రభుత్వం మారినతర్వాతనే నిజమైన సమీకరణయత్నం జరిగింది, అప్పటికి సమయం మించిపోయింది ఎంత అనుకున్నా ఏసైన్యాలను యెక్కడ ఉంచితే బాగుంటుందో, అది వీలులేకపోయింది. అందువల్ల, గతయుద్ధంలో వలెనే యిప్పుడు గూడ యుగోస్లావు సైన్యము యెంత సాహస కార్యాలతో పోరాడినా, సరియైనఆలోచన లేనందున జర్మను పోటును అది ఆపలేకపోయింది.

మేము మధ్యప్రాచ్యమునందుండగా టర్కీరాజనీతిజ్ఞులతో పలుమారుమాట్లాడగలిగినాము, గ్రీసు సందర్భమున మా ఆలోచనలను మిత్రదేశమైన తుర్కీ ప్రభుత్వానికి తెలిపినాము. బ్రిటను పట్లవారు చూపినమైత్రి, తమపూర్ణ రాజ్యరక్షణకు చూపినపట్టుదల నాకు నచ్చినవి. యుద్ధప్రారంభమునుండి స్వతంత్రంగానుండి తుర్కీ మన పక్షానికి చాలా సహాయం చేసినది,

మధ్యప్రాచ్యమున మరిదౌర్జన్యం జరుగకుండ తుర్కీ దుర్గముగా నిలబడగలదనుట స్పష్టము.''

## కురుపులు
## 6 రోజులలో నయమైనవి

అని వాడినవారు కృతజ్ఞతాపూర్వకగా వ్రాయుచున్నారు.

నాచేతులకు, రొమ్ముమైన అనేకరకములుగా కురుపులులేచి బాధపడుచుంటిని. వాటికన్నిటికి జర్మెక్సు బాగా పట్టించితిని. చితికిన కురుపులు ఆ రేమరో జులలో ఎండిపోయినవి, అప్పటికి చితకకుండా యున్నవన్నియు అదేవిధముగా బాధలేకుండా అదేమందుతోనే మాడిపోయినవి.

(సం) సి. యం. భక్త్తర్

23 — 6 — 39 మద్రాసు

ఏజంట్లు
జె. ఫాస్ట్ & కో
శికింద్రాబాదు

Germex

## జర్మెక్సు

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర వైశాఖ బ॥ ౫

గురువారము


## బావుల పన్ను

హైదరాబాదు ప్రభుత్వమువారు రైతుల అభివృద్ధికిగాను మంచి శ్రద్ధవహించుచున్నారు. ఈ రెండు మూడేండ్లలోనే ఖడ్డీ శాసనము, భూపరాధీన శాసనము, మాఫీలు, స్టేటు బెంకుస్థాపన, గ్రామసముద్ధరణ సంఘ స్థాపన, రైతుల ఆర్థికవిచారణ, మున్నగునవెన్నియో చేసినారు. రైతులపన్నుల భారమునుకూడ తగ్గించే ఆలోచనలు కూడ చేయుచున్నట్లు వ్యక్తమైనది. మన పూజ్యప్రధానామాత్యులంగారు రెండేండ్ల క్రిందటనే యిట్లు సెలవిచ్చిరి. "రైతులభారమును తగ్గించి ఆభారమును వహింపశక్తులైనయితరులపై మోపునట్టి ఆలోచనలో ఉన్నాము" అని సెలవిచ్చియుండిరి. అనగా ఆదాయముపన్ను విధించువారై యుండిరి. కాని మన దురదృష్టముచేత అది ఇవ్వర్థాగిపోయినది. ఆదాయముపన్ను విధించుట అత్యంతావసరము. ప్రభుత్వానికిని లాభముకలదు. సుఖముగా సులభముగా సంపాదించు ధనికులునుఅధికారులునుప్రభుత్వకోశమునకు సుఖముగనే సులభముగానే తోడ్పడగలిగినట్టివారై యున్నారు. ప్రభుత్వమువారు తొందరగా దీనిని ప్రవేశపెట్టుదురని మనవిచేసుకొనుచున్నాము.

తెలంగానాలోనే బావులెక్కువ. తెలంగానా చెలకభూములే తరిసేద్యమున కనుకూలమైనట్టివి. ఏకారణముచేతనో ఎన్నడో ఒక నిర్ణయమును మాల్గుజారీవారు చేసియుండిరి. ౧౩౧౭ ఫసలీకన్న పూర్వముండిన బావులపై తరీపన్ను పూర్తిగా వసూలుచేయబడునని యు ౧౩౧౭ తర్వాత కొత్తగా త్రవ్వబడిన బావులపై తరీ పన్ను వసూలుచేయక ఖుష్కీ పన్నులే వసూలు చేయుమనియు శాసించిరి. దానిననుసరించి యింతవరకును అదేవిధముగా ఆచరణ జరుగుచున్నది. ౧౩౧౭ ఫసలీకిపూర్వము బావులే తెలంగానాలోవిశేషముగా ఉన్నవి. అందుచేత రైతులకు పన్నులభారముచే ఏమియు లాభములేక వారికష్టమంతయు గట్టురాళ్లుమోసినట్లుగా ఉండిపోవుచున్నది.

ఈ తరీపన్ను భారమును గురించి యెన్నో యోమారులు సభలలోను పత్రికలలోను రైతులు మొరపెట్టుకొన్నారు. ప్రభుత్వమువారికి విజ్ఞప్తులిచ్చుకొన్నారు. తుదకు ప్రభుత్వమువారికిని ఈవిషయమై సానుభూతి కలిగినది వరుసగా మూడు సంవత్సరములనుండి పాత బావులక్రింది భూములపన్నులో రూపాయిలో పదణాల యెనిమిదిపైసల మాఫీయిచ్చుచు వచ్చినారు. అయితేయిది తాత్కాలికమైనది. ప్రాతభావులక్రింది భూములపన్నులలో కొత్తబావులక్రిందయెట్లు ఖుష్కీపన్ను తీసుకొనుచున్నారో ఆవిధముగానే తీసుకొనవలెనని రైతులు ప్రార్థించుచున్నారు. ప్రభుత్వమువారును ఈ విషయమును గురించి విచారించుటకై సబ్ సమితి సమర్పించుటకు అధికారులకు ఆజ్ఞాపించినారని వినియుంటిమి. తాలూక్దారులును సుబేదారులును కొన్ని తాలూకాలలో కొన్ని గ్రామాలలో విచారణచేసియుండిరనియు వినియుంటిమి. ఇటీవల స్థానిక పత్రికలలో మరికొన్ని విశేషాలు వ్రాయబడినవి. ఈ పన్నుల తగ్గింపు విషయాన్ని విచారించుటకొక ఉపసంఘము పనిచేయుచున్నదని వ్యవసాయప్రముఖులను ప్రజాప్రముఖులను కొందరినిపిలిచి వారి అభిప్రాయములను తీసుకొనుచున్నారనియు అట్టివారిలో ఇంతవరకు ౪౦ మంది అభిప్రాయాలను తీసుకొన్నారనియు కొందరువ్రాసిరి. ఏది యెంతవరకు సత్యమో చెప్పజాలము. ప్రభుత్వమువారు కాని, వారిచే నియమితులైనఉపసంఘము వారుకాని యేవిధమైనప్రకటన చేసియుండలేదు. ప్రజాభిప్రాయము లెట్టివారిద్వారా తెలుసుకొనినారో ఇంకనుఎట్టివారియభిప్రాయములను స్వీకరింపనున్నారో తెలియదు. ఏదియెట్లున్నను యీసంవత్సరాంతములోగా రైతులకనుకూలమైననిర్ణయమును ప్రభుత్వమువారు చేసి రైతుల నిరంతర కృతజ్ఞతకు పాత్రులగుదురుగాక.

## కాగితం ధరలు

మేము మా వైశాఖ శు ౨ నాటి సంపాదకీయములో ఇట్లు వ్రాసియుంటిమి. "యుద్ధానికిపూర్వము మాపత్రికకు వినియోగించు కాగితము ఒకరీముక్రయము ౨ ౪-౦ ఉండెను. తర్వాత మన ప్రభుత్వాని అనుగ్రహాన ౫-౮-౩ అయ్యేను. ఇపుడు ౮-౧౨-౦ అయినది."

ఈ వాక్యములు అపోహానికి కారణమైనవి. ౨-౪-౦ ధరఉండిన కాగితాన్ని ప్రభుత్వమువారు ౫-౮-౩ వరకు పెంచిరి అను నర్థమువచ్చినదనియు ఇదేట్లు! అని యు మమ్ము ప్రకటన శాఖ వారువిచారించినారు. యథార్థమేమనగా—

కంపోజుచేయుటలో మధ్యన ఒక వాక్యమెగిరిపోయినది. ఒకరీముక్రయము ౨ ౪-౦ ఉండెను అన్నవాక్యం తర్వాత మరొక వాక్యం ఇట్లుండెను. "యుద్ధమారంభముకాగానే అక్రయం ౮ రూపాయలవరకు తటాలునపెరిగెను." ఈ వాక్యము తర్వాత ముద్రితమైనవిధముగా "తర్వాత మనప్రభుత్వాని అనుగ్రహాన ౫-౮-౩ అయ్యేను........అని వ్రాసితిమి మధ్యవాక్య మెగిరిపోయినందున యీఅపోహానికి కారణమైనది.

ధరవిపరీతముగా అనగా ౮రూ॥ వరకు పెరిగినదానిని ప్రభుత్వస్టేషనరీశాఖవారు ౫-౮-౩ క్రయానికి మాకునప్లై చేసి చాలాఉపకారముచేసిరి. ఇప్పుడు బజారుధరలింకను పెరిగిపోయినవి. ఈవివరణవలన ఇదివరకుకలిగిన అపోహదూరమగునని తలంతుము. అచ్చువారి పొరపాటువలన మరొకమారు మా అభిప్రాయాన్ని విపులీకరించి చెప్పుకొనవలసి వచ్చినది.

## అనల్ హలిక్ సిద్ధాంతము.

హైదరాబాదులోని ప్రతి మహమ్మదీయుడును "నేనే రాజును" అనురాజకీయ (గాయత్రి) కల్మానుమననము చేయవలెను అనిఇటీవల ఖాయూమిల్లత్ నవాబ్ బహద్దర్ యార్ జంగ్ బహద్దర్ గారుతీవ్రముగాప్రచారము చేసియుండిరి. ఈసిద్ధాంతమును మేముఒప్పుకొనము అని ఇత్తెహాదుల్ ముస్లిమీనుసంఘములోనుండిన కొందరు మౌల్వీ నాయకులు బయటికి వెళ్లిపోయిరి. అట్టివారిప్పుడొకపత్రికాప్రకటనము చేసియున్నారు

ఇత్తెహాదు ల్ముస్లిమీన్ సంఘ కార్యవర్గము వారు ౩.౫ఖుర్దాదు నాడుఒక పత్రికా ప్రకటన చేసినారు. అందుతమసిద్ధాంతములనుగురించి చర్చించుచుఅవి మౌల్వీలందరి ఏకాభి ప్రాయముచే నిర్ణయమైనట్లుగా తెలిపినారు. ఇదిఅబద్ధము. మౌల్వీలలో ఈ భావాలులేవు. రాజకీయ కల్మా అని పేరుపెట్టి ఇత్తెహాదు వారీ సిద్ధాంతమును లేవదీసినారు "మేముదక్కను పాదుషాలము" "మేము తఖ్తు యొక్కయు కిరీటముయొక్కయు వారసులము" ప్రతి వాడును అనల్ మలిక్ (నేనే పాదుషాను) అని ఉచ్చరించవలెను.

ఇట్టివిధమైనాత్మక కారకములైనసందర్భములనుఅగుకల్మాలను మేము తీవ్రమైనసమ్మతి లేమా బహాదూఖప్పుకోనము. అప్పటికినిఇప్పటికిని ఎప్పటికిని మావిశ్వాసమేమనగా అసఫ్జాహీ సింహాసన కిరీటములకువారసులు అసఫ్జాహీ వంశమువారుతప్పమరెవ్వరును ఎన్నటికిని వారసులుకానేరరు పాదుషా గారుస్వయముగా ప్రజలందరికిని అందముఖ్యము గాదక్కను ముసల్మానులకు ఏకైకఅధిపతులునైయున్నారు మరియు దక్కను ముసల్మానులందరును పాదుషా గారిని అల్లాహ్ చాయగాను ఇలాహీ హుకూమతు యొక్క మూపధారులుగాను ముస్లిం ముస్లిమేతర ప్రజలసంరక్షకుల గాను ఇస్లాంయొక్కయు ముసల్మానుల యొక్కయు శ్రీధిభూతులుగాను భావించుచుండిరి, భావించుచున్నారు, ఇకముందును భావించగలరు అసఫీ సింహాసనకిరీటములయొక్కయు ప్రభువుగారిస్వతంత్రాధికారములయొక్కయు సంరక్షణకైమాయొక్క అత్యంతప్రియమైన వాటినిగూడబలిదానముచేయుటతో మామతినిధియని ప్రకటించుచున్నాము.

౧౦ రబ్బియుస్సాని ౧౩౬౦ హి సంతకాలు.

మహమ్మద్ అబ్దుల్ ఖదీర్ సిద్దీఖీ
సయ్యద్‌మహమ్మద్ బాద్షాహు సేనీ
షైఖుర్ అహమ్మద్‌షత్తారీ
మ॥ హబీబుల్లాహు సేఠ్
అబ్దుల్ వాహిద్ ఒవేసి
సయ్యద్‌మ॥ ఫరీద్ ఓ ద్దా ఖ్వా, సీ
(సు పేదక్కను నుండి)

## హైదరాబాదు సేనల సమాచారము

హైదరాబాదు సేనల రెజిమెంటులోని ఒక బటాలియను భారతదేశానికి తూర్పున ఉండే ప్రాంతంలో ఒకచోట మార్గానపోవుచుండగా గొప్పగొప్ప అమెరికాపత్రికలయొక్కయు, వైరీయ పత్రికలయొక్కయు, బ్రిటిషు న్యూస్ ఏజన్సీల యొక్కయు ప్రతినిధులు దాని ఫొటో తీసుకొనిరి. ఈనడచుచున్న సేనలను అన్నివైపులనుండి ఫొటోలు తీసికొనుటకై కామెరా మనుష్యులు పండవలసివప్పుడు వంగి, మోంగిల పండుకొనవలసి వప్పుడు పండుకొని నానాశ్రమలు పడిరి. తమ ఫొటోలు తీసికొనుచున్నారను సంతోషము తన్నను అభారతీయసైనికులు ఏమాత్రము చలించక తమమార్చిని సరిగా సాగించిరి.

ఇంతలో సీటీ కేకవినబడెను సైనికులు ఒక సైన్యసమాధివద్ద ౧౦ నిమిషము లాగిరి ఆక్కడ విశ్రాంతిగా కూర్చుండి సిగిరెట్లు కాల్చుచుండగా, ఫొటో తీసికొనువారలు వచ్చి సమీపంలో ఫొటోలను తీసికొనసాగిరి. అప్పుడు సైనికులుతమ గర్వమునంతయు బాగుగా వ్యక్తము చేసిరి. ఒక ఆజానుబాహువగు జాట్ సిపాయి కామెరావాన్నలను ఉటిమిచూచెను. ఒకసూబేదారు మీసము తన కెడ్డనిమాయను త్రిప్పెను.



## ౧౯౩౦ సం॥ పు ఆంగ్లో-ఇరాకీ సంధిపత్రము.

ముఖ్యషరతుల వివరణము

౧౯౩౦సం॥ జూన్ ౩౦ తారీఖున ఇంగ్లాండు ఇరాకు గావించుకొనియుండిన సంధిలో ముఖ్యభాగములు ఈక్రింద నుల్లేఖింపబడుచున్నవి.

వాల్గవషరతు— ఈరెండుదేశములలో నేఒకదేశమైనను యుద్ధములో తగల్కొనినచో రెండవదేశము వెంటనే సహాయమునకు రావలెను, యుద్ధభయమేర్పడినచో సంధిచేసుకొన్న రెండుదేశములవారును కలిసి ఆలోచించి రక్షణమునకై తగినచర్యలు గైకొనవలెను. యుద్ధభయ మేర్పడినగాని యుద్ధము ప్రారంభమైనగాని ఇరాక్ రాజు చేయవలసిన సహాయమేమనగా ఇరాకు దేశములో బ్రిటనుకు అన్నివిధముల సౌకర్యములు కలుగజేయవలెను, సహాయము నొసంగవలెను. రైల్వేలు, నదులు, రేవులు, విమానాశ్రయములు మోటారులు ఇత్యాది యానములు బ్రిటీషువారి ఉపయోగమునకై యివ్వవలెను.

౫ వషరతు— దేశములో శాంతియేర్పరచుట శత్రువులబారినుండి దేశమును రక్షించుట ఇరాకురాజు బాధ్యతయై యున్నది, వినను, సర్వావసరములందు ముఖ్యమార్గములను బ్రిటిషురాజు కాపాడుట యిరువురికిని లాభదాయకమని ఇరాక్ రాజు గ్రహించుచున్నాడు. ఈఉద్దేశ్యముతోను, ౪ వషరతుప్రకారము బ్రిటనుయెడలకల బాధ్యతలను నిర్వర్తించుటకును, బాస్రావద్ద బ్రిటీషువారొక విమానాశ్రయము నేర్పరచుటకును యూఫ్రిటీసునదికి పశ్చిమమున వారు మరియొక విమానాశ్రయము నేర్పరుచుటకును ఇరాక్ రాజు స్థలములనొసంగ నంగీకరించుచున్నాడు. మరియు ఈవిమానాశ్రయములలో బ్రిటను సైనికులనుంచవచ్చును, ఈసైనికులు ఇరాక్ స్వాతంత్ర్యమునకు భంగముకలుగునట్లు మాత్రము ప్రవర్తింపరాదు.

అనుబంధములందలి ఒకటవషరతు సంధి అమలులోనికి వచ్చిన ౫ సంవత్సరములకు ౫ వ షరతులో ఉదాహరింపబడిన విమానాశ్రయములలో బ్రిటనురాజు సైనికుల నుంచవలెను, ఈసంధి అమలులోనున్న కాలములో బ్రిటనువారుపయోగించుకొనుటకు ఇరాకురాజు స్థలము నొసంగును.

సైనికులకు దేశముగుండ వెళ్లనిచ్చుటకు యేర్పాటు.

౬ వషరతు: బ్రిటనురాజు కోరినప్పుడు బ్రిటీషు సేనలను దేశముగుండా పోనిచ్చుటకును, ఈసైనికులకు కావలసిన సామగ్రినిదేశముగుండా పోనిచ్చుటకును ఇరాకురాజు అంగీకరించుచున్నాడు బ్రిటిషువారు రోడ్లను, రైల్వేలను, నదులను, రేవులను, విమానాశ్రయములను ఉపయోగించుకొనవచ్చును. బ్రిటీషు ఓడలు షాట్ అల్ అరబ్ రేవుకు వెళ్లుటకు అనుమతియుండును కాని, యిట్లు చేయుటకు పూర్వము ఇరాకురాజుకు తెలుపవలెను.

అమలులోనికి వచ్చినవాటినుండియు ౨౫సంవత్సరములు ఈ సంధి అమలులో నుండును.

## దిగ్బంధనం

ఖమ్మం మెట్టునివాసులగు పి. హనుమయ్యగారిని హైదరాబాదు రక్షణ శాసనముక్రింద ప్రభుత్వమువారు దిగ్బంధనంచేసినారు- వారుతమస్వగ్రామమగు కొయ్యన్నపాలెము హద్దులనుదాటిపోరాదనియు, ఇతరులతో పత్రికావ్యవహారాలు చేయరాదనియు, ఏసభలలోను మాట్లాడరాదనియు, ఆజ్ఞాపించినారు. [ఖ్మా. ఖ బలిక]

## చిలుకూరు ఎనిమిదవ ఆంధ్రమహాసభ

కాఫీహోటళ్లు ఇతరదుకాణములు.

౨౯-౩౦-౩౧ తేదీ తేదీలలో ఎనిమిదవ ఆంధ్రమహాసభ, జరుగనున్నది. ఈసందర్భమున కాఫీ ఫలహారహోటళ్లు, పుస్తకవిక్రయదుకాణాలు, దేశీ వస్తు విక్రయదుకాణాలు పెట్టుటకు తెలంగానాలోని వివిధప్రాంతములనుండి దరఖాస్తులువచ్చుచున్నవి, హోటళ్లకు ఇతరదుకాణములకు ఈక్రిందిధరలు మూడురోజులకు నిర్ణయించబడినవి.

కాఫీహోటలు మూడురోజులకు రు ౭౫-౦-౦
యితరవస్తువిక్రయదుకాణాలు , ౫-౦-౦

ఈషరతులకు అంగీకరించినవారు మార్దనకి ౨౦ వ తేదీవరకు వ్రాతమూలకముగా తమ అంగీకారపత్రమును పంపవలయును.

ఆసహ్యత, ఆవిలీనకరమైన వస్తువిక్రయము వారికి అనుజ్ఞయివ్వబడదు.

ఇట్లు,
ఆహ్వానసంఘ కార్యదర్శులు
రామగిరి, నల్లగొండ.

## నిజాంరాజ్య ముదిరాజ మహాసభ

తేదీల మార్పు

మైమహాసభా కార్యకారిణి సభవారి తీర్మానమేమనగా క్రిమిణం ప్రభువనిర్ఘ్యని తర్లి గారి మరణమువలన ౧౩౫౦ఫ॥ తీరుమెంఅ ౯, ౧౧, ౧౨ తేదీలలో జరుపవలసిన కార్యక్రమం ౧౩౫౦ ఫ॥ తీరుమెంఅ ౨౧, ౨౨, ౨౩ తేదీలలో జరుపనిశ్చయింపబడెను.

బి. వెంకటస్వామి ముదిరాజు
కార్యదర్శి.

## అఖిలభారత పద్మశాలి మహాసభలు

స్థలము షోలాపూరు

తారీఖులు వృషసంవత్సర వైశాఖ బ॥ ౯, ౭, ౮, (౧౯౪౧ మే ౧౯,౧౭,౧౮

### పద్మశాలిఅష్టమమహాసభ

అధ్యక్షులు శ్రీమాన్ ధిగొండ సాయన్నగారు (అహమ్మద్‌నగర్)

### పద్మశాలి చతుర్థయువక మహాసభ

అధ్యక్షులు శ్రీయుత కార్యంపూడి రాజమన్నారుగారు, ఎం. ఏ. (ఆనర్సు) (ఒంగోలు)

### పద్మశాలిద్వితీయ మహిళాసభ

అధ్యక్షురాలు శ్రీమతి వై. ఆర్. రంగమ్మగారు, బి. ఏ. బి. టి. (బెంగుళూరు)

## అల్లముల నాపుటకు చర్యలు

భారతదేశరక్షణ నియమావళి

కింద అరెస్టులు

అలహాబాదులో అల్లరులు మరలరేగకుండ ఆ ప్రుట కైఅధికారులు ఒకమతపువారిపై మతకక్షి ద్వేషము పురికొల్పువారలపై కఠినచర్యలను గైకొనుచున్నారు. ఇతరమతములవారలపై ద్వేషములను పురికొల్పఉపన్యాసాలను చేసినవారలను అరెస్టుచేసిభారతదేశరక్షణ నియమాలలో రెవనియము ప్రాసెక్యూటు చేయవలెనని అధికారులునిశ్చయించుకొనినట్లు కనబడుచున్నది. ఈనిర్ణయానుసారముఅప్డుడేఅలహాబాదు నగరముస్లింలీగు అధ్యక్షుడగు మఫ్ఫుఖుల్ఇస్లాంగారు పోయిన మార్చినెలలోపాకిస్తాను దినమున హిందువులపై ముసల్మానులకు ఉద్రేకముకలుగునట్లు ఉపన్యసిం

చెనను నేరమునకై అరెస్టుచేయుబడినారు, వారినిజమానతుపై విడుదలచేయవలెనని దరఖాస్తుపెట్టుకొనగా డిష్ట్రిక్టుమేజిస్ట్రేటు అగు ఖాన్ సాహెబ్ విష్ణుప్రసాదు నేమీగారు ఈ నేరము లోజమానతుపై డుచుటకునీలులేదని నిరాకరించినారు.

ఢిల్లీచక్రవర్తి మునుమని సత్యాగ్రహం

ఆగ్రాయు ప్రచారకుడగు షహజాదానికందర్ గారుకడపటి మొగలాయిచక్రవర్తియగు కీ॥ శే॥ బహదర్ షా మనుమడనని చెప్పుకొనుచు జామా మసీదులో ఒకఉపన్యాసము చేసెను. అందులో అయనతనపూర్వులస్థానమని తాచుతలచుచున్న ఎర్రకోటగేటుకెదురుగ సత్యాగ్రహము చేయగలనని చెప్పెనట, అందుపైసత్యాగ్రహము చేయుటకుముందే అరెస్టుచేయుబడినాడు. అక్షేపణీయమైనఉపన్యాసము చేసిననేరమునకై అతనికి కఠినకారాగారవాస శిక్షవిధించబడినది

---

## వెయ్యి రూపాయిల

## నగదు బహుమతి

మాఅన్నదమ్ములగు ఇటీవలచనిపోయిన (1) కౌమారపుసాంబయ్య (2) కౌమారపు బుక్కా వీరభద్రయ్య (3) దత్తుపోయిన కౌమారపు బుక్కా నరసింలు (4) కౌమారపు బుక్కా కిష్టయ్య [5) కౌమారపు బుక్కా కుమారస్వామి (6)చనిపోయిన కౌమారపు బుక్కా చంద్రమూర్తి మా అన్నదమ్ములు పంజాప్రయోగట వేరబడినప్పుడు 260 రెండువందల అరవైతులముల అభరణములు ఈక్రిందివి లేకుండెను.

4 నాల్గుతులముల బంగారుకంటె ఇరువై తులముల ఒకటినాగలక్ష్మిపుస్తి 15తులములది వీరమ్మది, 15తులములదిఒకటి నాగమ్మది, 15 తులములదిఒకటి చినగోపమ్మది, మొత్తము 65తులములు, 40తులముల ఒకబంగారుబాడాసాదో ఇందే రాంరావుగారిది, 25తులముల రెండుపెద్దజోమాలలును, 10పదితులముల రెండుచిన్నగుష్ఠహారాలలు, అయిదుతులముల ఒకపెద్దగుంగురుగల జోమాల మొత్తము ఏనుబైతులములు—నూరుతులముల ఒక బంగారుపూసల కంఠహారము పదితులముల ఒక ముగురేలహారము, ఏడుతులములఒక పోంచీ మొత్తము 115తులములు_మొత్తము 260తులముల అభరణములు—

ఇట్టిఆభరణములనిమిత్తమై ఇందులో తెగియపరచినవారు కలవిగాని లేక వేరువేరుగా గాని అమ్మిన లేక గిర్వీపెట్టిన ఇట్టివ్యవహారమునకు సంబంధించినగల వర్తకులకు, వ, బేంగు అధికారులకు, లేక ఇట్టి వ్యవహారమునకు సంబంధముగలఎవ్వనికైను నేరమునకుగురికాకుండ ప్రతిజ్ఞాపూర్వకముగ గాని లేక నేరుగా వారుగాని తెల్పినచో వారికి వెయ్యి రూపాయిల బహుమానము సంగిబడును.

ఇట్లు,

కౌమారపు

బుక్కా కిష్టయ్య

జనరల్ మర్చంటు,

కరీంనగరు.

---







---

# "భాగ్యనగర పదబంధము" నెం. 4

మీయుకోరికయే బహుమతుల నిచ్చుకల్పవృక్షము

రూ 1500

వారంవారం వర్షము అందుకొని ఆనందించండి

ముగింపు తేది 25-5-1941.

ప్రవేశరుసుము కూపనుఒకటికి (బ్రిటిషు రూ 0-4 0 లేక హాలీ 0-5-0 కా) పేములపంపువారు వుచితముగా ఒకకూపను పంపుకోవచ్చును.

| | |
|---|---|
| మొదటి బహుమానము | రూ. 800-0 |
| రెండ ,, | ,, 400-0 |
| మూడవ ,, | ,, 200-00 |

ఈపజిలు తాలూకు కిసాల్యూషన్ సీలువేసి దక్కన్ క్రానికల్ పత్రిక ఆఫీసులో డిపాజిటు చేయబడినది

కూపన్లు తెల్లకాగితములపై వ్రాసిపన్నెనాపంపవచ్చును, అచ్చుకూపన్లు కావలసిన 0-1-0 తపాళాబిళ్లకు గాను కూపన్లుపంపబడును. మనియార్డరు రసీదు కూపన్లతో జతపరచాలి సికింద్రాబాదువారు మాఆఫీసులో కూపన్లుఅందచేసి రసీదుపొందవచ్చును పోస్టలుఆర్డర్లు క్రాసు చేయగూడదు, కొత్తపజిలు నెం 5 బహుమానాలుపొందిన వారిపేర్లు 1-6-41 న వెలువడే తెలుగుతల్లిలో చూడండి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 బ | హు | మ | 2 తి | ■ | 3 | త్ర | 4 ష | |
| 6 క | | ■ | 7 మ్మ | అ | ■ | 8 వా | | |
| ము | ■ | 9 | దు | ■ | 10 ఉ | రు | ము | లు |
| ■ | 11 | రి | ■ | 12 ప్ర | తి | | ■ | |
| 13 | రు | ■ | 14 ఖ | ట్ట | ■ | ము | 15 | ■ |
| ■ | ఫు | 16 17 గా | ■ | ■ | 18 | ■ | | ■ |
| 19 భూ | ■ | త్ర | 20 ము | 21 స | మో | ■ | మ | 22 |
| 23 ప | | ము | ■ | ఖ | ద | ■ | ము | మ్మ |
| ము | 24 | ను | ■ | 25 య | ము | భ | ■ | ను |

ఆధారములు (అడ్డము)

(1) భాగ్యనగర పజిల్సులో ఇది సామాన్యంగా లభిస్తుంది. (3) షిట్లరు కులభవిజయాలకు ఇవియే కారణములు (6) ఏనుగు. (7) అమ్మ (తలక్రిందు) (8) సామాన్యంగా పనిపాటలేని వారికి ఇదంటే చాలా ఇష్టం (9) ఇది లేనిదే కొడదు ఇంటిగడప దాటరు (10) ఇవి లేనిదే వానవస్తుందా? 11 శత్రువు (12)" " యొక్క మనస్సు కనిపెట్టాలంటే చాలా కష్టసాధ్యము (13) మీరువ్రాసే పుత్తరాల విలాసములో ఇదితప్ప [illegible] చోటు (16) హిందువులు దీన్ని పూజిస్తారు (తల్లక్రిందులు) (20), మోసము (తల్లక్రిందు) (23) సంతోషదినము (24) మొదలు (25) భయము (కలగలుపు)

ఆధారములు (నిలువు)

(1) కొంగ, (2) కొంటెచేష్టలు చేసేవారిని సామాన్యంగా దీనితో పోలుస్తారు, (4) జీవితములో ప్రతివారూ ఇదికోరాలి (5) ములుకులు (కలగలుపు) (8) పూర్వ ప్రయుద్ధాలతో దీని ఉపయోగమెక్కువ, (11) ఇది ఎక్కువైతే కష్టము, (12) పుస్తకాన్ని భద్రంగావుంచుతుంది, (15) ఇది ఇతో అంతోవుండేగాని జీవితంలో రాణించదు (17) పెండ్లిమాళ్ళలో దీనిని తప్పకవిచారించాలి, (18) ఇది లేనివ్యక్తి జీవితమెంతో కష్టము, (19) దేవతపూజకు ఇది తప్పకుండాయుండాలి, (21) [illegible] (22) [illegible] మూర్తేనంతోషము.

(నన్ను ఒకఅక్షరము గాపరిగణింపబడును జవాబుకొరకు 0-1-6 పోస్టేజిబిళ్ళపంపాలి.)

వివరాలకు,— మేనేజరు.

భాగ్యనగర పజిల్సు,

Opp' రైల్వేస్టేషను, సికింద్రాబాదు-దక్కన్.

---

### మాల్టా అలెగ్జాండ్రియాలపై జర్మను విమానాలు

మాల్టాపై మేతొమ్మిదవ తేదిన జర్మను విమానాలు చాలా తీవ్రముగా బాంబులను వేసినవి. కొందరు జనులు చచ్చిరి, కొందరు గాయపడిరి. రెండు జర్మను విమానాలు క్రిందకూల్చబడినవి. మే ౧౦వ తేదిన రాత్రి చాలా జర్మను విమానాలు మాల్టాపై బాంబులను వేసినవి. మొత్తంలో రోజు మూడు జర్మను విమానము లక్రిందకూల్చబడినవి. మే ౮వ, ౯వ తేదులలో రాత్రులందు అలెగ్జాండ్రియా రేవులపైకి జర్మను విమానాలువచ్చి బాంబులను వేసినవి క్రింద బ్రిటిషువారి కనుకునష్టమేమియులేదు. ౧౦వ తేదిరాత్రికూడ ఇట్టేదాడిజరిగినది.

### సూయెజ్ కాలువపై జర్మను విమానాల దాడి

మే ౧౦వ తేదిరాత్రి జర్మను విమానాలు సూయెజు కాలువప్రాంతంపై దాడి చేసినవి. అక్కడ బ్రిటిషు వారి రైల్వేలకును, టెలిగ్రాఫులకును, టెలిఫోనులకును కొంతనష్టముకలిగినది.

### ఈజిప్టుపై జర్మనుల దృష్టి

జర్మనులిక ఈజిప్టుపైకి దాడి వెడలెదరని ఆస్ట్రేలియా తాత్కాలిక ప్రధానియగు ఫాడన్ గారు మే ౧౨వ తేదిన చెప్పినారు. అందు చేతనే బ్రిటిషు సేనలిప్పుడు ఈజిప్టులో చేర్చబడుచున్నవని వారు.

### పోర్చుగల్లును ఎవరును ఏమీ అడుగలేదు

పోర్చుగల్లులోగాని, అట్లాంటిక్ సముద్రంలో పోర్చుగీసువారికి సంబంధించిన దీవులలోగాని ఓడరేవులనుగాని విమాన, నౌకా, సైనికులకు ఆశ్రయములనుగాని తమకివ్వవలెనని ఎవరును పోర్చుగీసు ప్రభుత్వమును కోరియుండలేదని ఒక పోర్చుగీసు ప్రభుత్వప్రకటనలో తెలుపబడినది. అమెరికా సెనేటు సభలో పెప్పర్ అనువారు ఉపన్యసించుచు వాటిలు పోర్చుగీసువారి అజోర్సుదీవులను, కేప్‌వర్డీ దీవులను అతిక్రమించగలరు కావున, అమెరికావారును, బ్రిటనున్ను ముందుగానే ఆదీవులను ఆక్రమించవలెనని చెప్పినదానికి పోర్చుగీసు ప్రభుత్వపు ప్రకటన ఖండనగా చేయబడినది.

పోర్చుగీసు సేనలు కొన్ని కేప్‌వర్డీదీవులకు పంపించబడుచున్నవి. పోర్చుగీసు సేనలు కొన్ని ఉండే ఒకటిన అజోర్సుదీవులకు పంపబడుచున్నట్లు ఒక వార్తవచ్చినది.

### ఫ్రాన్సులో మరికొన్ని స్థలాల ఆక్రమణకై ఎత్తు

ఫ్రాన్సులో ఇప్పటికి జర్మనులు ఆక్రమించియుండని మరికొన్ని ముఖ్యస్థలముల నాక్రమించుటకై జర్మను సేనలు రహస్యప్రయత్నము చేయుచున్నవి.

### స్పెయినులో నాజీల ఎత్తులు

స్పెయినులో సూనరుగారు దేశీయాంగ మంత్రిస్థానమునుండి విదేశీయాంగమంత్రిగా చేయబడిన తర్వాత ఇప్పుడు దేశీయాంగమంత్రిస్థానానికి వాలెన్ టైన్ గలార్జా అనునతడు నియుక్తుడైనాడు.

స్పెయినులోకి జర్మను సేనలు పోవుటకు అన్ని ఏర్పాటులను చేయబడుచున్నవి: ఫ్రెంచివారు జర్మనీకి లొంగిపడుటను బట్టియు, సూయెజు ప్రాంతమును జర్మనులు ఆక్రమించుటను బట్టియు స్పెయినులోకి జర్మను సేనల ప్రవేశముండును.

### అమెరికాలో నాజీల కుట్రలు

వాషింగ్టనులో మే ౧౦వ తేదిరాత్రి అమెరికా యుద్ధకార్యదర్శియగు స్టింసను గారు నేటి రాత్రి అమెరికను రేడియోలో ప్రసంగించుచు:

"ఇంగ్లాండును అమెరికానుండి రవాణా చేయబడు సరకులను గొంపోవు నావల వెంట అమెరికను యుద్ధనావలు తైనాతీగ పంపబడవలెను. వెంటనే ఇట్టి ఏర్పాటు చేయబడవలెను. అమెరికా దేశమును రక్షించుటకు మనము సర్వశస్త్రములను వినియోగించవలెను.

అయిరోపాఖండంలో జరుగుచున్న సంక్షోభము మనకు చాలా సమీపంగానే జరుగుచున్నదని గ్రహించవలెను నాజీమహాంకారం అమెరికా ఖండమును కూడ ముట్టుచున్నది. దక్షిణ అమెరికా రాజ్యాలలో నాజీ కుట్రలు సాగించుచున్నారు. విమానసర్వీసులను నడిపించుచున్నారు. పెనామా కాల్వవరకు ఈ నాజీ సమీపించుచున్నారు. పశ్చిమఆఫ్రికా కోస్తాను యీ జర్మనులు చేరుచున్నారు. అక్కడినుండి సులభంగా దక్షిణ అమెరికాలోని బ్రెజిలు మీదకు దూకుటకు తగినస్థావరములను ఆక్రమిస్తున్నారు.

మన అమెరికా సంయుక్తరాష్ట్రములలో నే యీ జర్మనుల ఏజెంట్లు కుట్రలు సాగిస్తున్నారు. అసాధారణప్రజ్ఞతో అనేక అవకాశములను వినియోగించుకొంటున్నారు. ఇతరజాతులవారి యెడల ద్వేషము పుట్టువరకు జర్మనులు పురికొల్పుచున్నారు" అని చెప్పిరి.

### రాయలసీమ

---

౧౭వ శతాబ్దమునుండి ఈ పేరు వాడుకలో నుండెను

---

డాక్టరు వెంకటరమణయ్యగారి ప్రకటన

---

మద్రాసు, మే ౧౨

మద్రాసు విశ్వవిద్యాలయములో రీడరుగనున్న డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు ఇట్లు వ్రాయుచున్నారు:—

౧౬, ౧౭వ శతాబ్దమునకూడ యీ దత్తమండలమును రాయలసీమయనిపిలుచుటకు అనేకములైన నిదర్శనములు కలవు. శ్రీ కట్ల వెంకటరామరాజుగారియొక్క రాజసభయందు మిక్కిలిప్రసిద్ధిపొందిన శ్రీ వడిమెట్టి వెంకటాచలపతిగారిచే రచింపబడిన యొక ప్రబంధమునందు యీ క్రిందివిధముగా కలదు.

ఈ. గాయకు లశ్వరాయబల ఖానులుమట్లు యనంతరాజకా, తేజము ఖాన్ ప్రవేశ్వరని చెప్పెడి దింతియ కాక వేయిపుడ, రాయలసీమలోనం జతురంగ బలంబులతో వైరముల, బాయకయున్నవారు నరిపారెను మెచ్చినయట్లు జాప్రమంద.

యీ విషయమును బట్టి మాడ్ సీడెడ్ డిస్ట్రిక్సును రాయలసీమయను నామము యిటీవలికల్పితము కాదనియు ౧౭వ శతాబ్దమునుండి వచ్చుచున్నదనియు విశదముగా తెలియుగలదు.

(ఆంధ్ర పత్రిక)

